శ్రీకోదండరామచంద్రాయనమః.



# రాఘవేశ్వరశతకము



గుండ్లపల్లెలోనుండు వల్లివేడు కాందాటి

## నరసమ్మగారిచే

రచియింపఁబడి

చిత్తూరు విక్టోరియా జూబిలీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

మొదటికూర్పు.

---

1932.



గుండ్లపల్లె నరసమ్మగారు.

శ్రీరస్తు.

# రాఘవేశ్వరశతకము.

ఉ॥ రామ! రమాకళత్ర! సుర - రాజసమాజ సరోజమిత్ర! సీ
తామహిళాకళత్ర! భవ - దారుణపాశలవిత్ర! నాయెడన్
బ్రేమదలంచి తప్పులఁ గ - ణింపక ప్రోవఁగ దిక్కు నీవ నా
స్వామివి దీనబంధుఁడవు - సాగిలి మ్రొక్కెద రాఘవేశ్వరా!

ఉ॥ రామ! గుణాభిరామ! రఘు - రాజకులాంబుధిసోమ! నీరద
శ్యామ! సురాధిపప్రముఖ - సన్నుతమంగళనామ! మానినీ
కామ! జయాభిరామ! దశ - కంధరగర్వవిరామ! సత్కృపా
ధామ! నమస్కృతుల్ మదిని-దాల్చిని ప్రోవుము ॥రాఘ॥ ౨

ఉ॥ కంటిసరోజనేత్రు నెదఁ - గంటిని శ్రీశితికంఠమిత్రునిన్
గంటిఁ బితామహున్ గనిన - క్రమగుణాస్పదుస్తుత్యపాదునిన్
గంటిని హేమచేలధరుఁ - గామితకల్పకభూజు. వేఱులే
దంటిని దిక్కు; ప్రోవుముద-యామయ! రామయ! ॥రాఘ॥

ఉ॥ చూచితి రామ నిన్ను బహు - సుందరవిగ్రహుఁ డంచు నా

యెదన్

జూచితిహస్తయుగ్మముని - జంబుగనచ్చుటఁ జిక్కఁబట్టితిన్
వేచితిఁజాలకాలము వి - వేకముగల్గెను సంతసించితిన్
నీచెలువంపునామము గ - ణింతునజస్రము ॥రాఘ॥ ౪.

ఉ॥ సీతనుగానఁగానకతి - చింతనుమున్న జటాయువంతనా
సీతనురావణుండుకొని - చెచ్చెరలంకకుఁ జేరెనన్ననీ
వాతటివంతనొంది విహ - గాధిపుఁజేతుల సంస్కరించి నీ
నాతినిగానమిన్ఋనుమ - నంబున నెంచవా ॥రాఘ॥ ౫.

ఉ॥ వాయుకుమారుఁగాంచిమఱి - వారకయర్కజుఁగూడిప్రేమన
త్యాయతవత్సుఁడైన యమ - రాధిపపుత్రుని గూల్చిరా
జ్యమున్
శ్రేయముగానొసంగ వెను - కందమ యర్కజసూతికావిధిన్
న్యాయముగాదొనన్నుగన - నర్మిలిబ్రోవుము ॥రాఘ॥ ౬.

ఉ॥ శ్రీరఘురామపాదసర - సీరుహయుగ్మము నామనంబునన్
ధారణిపుత్త్రిపాదములు - దప్పకనిల్పి భజింతుభక్తిచే
నోరిమినింబ్రమోదమున - నుత్పలమాలికఁగూర్చిసత్కృపా
పార! నగేశధీర! భవ - భంజనరంజన ॥రాఘ॥ ౭.

ఉ॥ ధారణినేనుబుట్టి తలి - దండ్రులనన్నలఁ బాసినాథునిన్
వారకగోలుపోయిపిన - నాఁటనెవంతలఁ గుందిత్వత్పదాం
భోరుహచింతనంబుమదిఁ - బూనికనిల్పి యనేకభంగులన్
వారిజనేత్రసన్నుతులొ - నర్చెదనెప్పుడు ॥రాఘ॥ ౮.

ఉ॥ రామ! యిదేమి? నీవుదిన - రాజకులాగ్రణి వయ్యునాకుసీ
పామరబుద్ధినిచ్చి తవ - పాదసరోరుహ చింతమాన్ప నే
నేమిదొసంగొసర్చినను - నెగ్గుదలంపక నీదుధ్యానమే
ప్రేమనొసంగి పుత్త్రియని - పెంపుఁదలంపుము ॥రాఘ॥ ౯.

ఉ॥ ఆసురబాధమాన్పసుర - లాఁదఱు శ్రీహరి! నిన్ను వేఁడఁగా
భాసురకోసలేంద్రునకు - బాలుఁడవై తనరారిధారణిన్
వాసిచెలంగఁదమ్ములను - వాంఛను బ్రోచుచు నెల్లవిద్దియల్
వాసిగ నేర్చినాఁడవు శు - భప్రద! శ్రీపద! ॥రాఘ॥ ౧౦.

చం॥ అనుజునిగూడి కౌశికమ-హామునివెంటజరింపుచున్ గడున్
వినయముతో సమస్త్రశర - విద్యలనాతని యొద్ద నేర్చియా
మునిసవనంబుగావ జగ - ముల్ వినుతింపఁగ సంహరింపవే.
దనుజులనల్లనాఁడు వర-ధర్మగుణోజ్జ్వల! ॥రాఘ॥ ౧౧

ఉ॥ రాతినినాతిఁజేసితివి - రంజిలనీశుని విల్లుద్రుంచి వి
ఖ్యాతిని దిక్కులన్ విస్తృతి-గానొనరించి విదేహరాట్సుతన్
సీతను బెండ్లియైమరలి - చెల్వుగ వచ్చుచు జామదగ్న్య ని
ర్భీతుని భంగపుచ్చితివి- వేడుకతోడను ॥రాఘ॥ ౧౨

చం॥ జనకజవామభాగమునఁ-సాదరమార సుమిత్రపుత్త్రికుల్
చనవునఁజామరాల్విసర - ఛత్రము శ్రీభరతుండుపట్టఁగా
ననఘవసిష్ఠమౌనియున-హర్నిశముల్ గొలువంగ వేడుకన్
ననుమఖవంగనీకుఁ దగు -నాసుగుణాకర! ॥రాఘ॥ ౧౩.

ఉ॥ తల్లియుఁ దల్లడిల్లఁగను-దండ్రియుఁ బ్రాణముఁవీడుచుండఁగా
నెల్లరు నేడ్చుచుండఁగఁబ-ౌరుల్ భరతుండును మౌనివేషియై
యల్లనవచ్చి వేఁడఁగను - నౌర! కరంగదునీమనంబు నే
నల్లనబిల్చినంత రయ - మారఁగవత్తువె ॥రాఘ॥ ౧౪.

ఉ॥ తల్లివరంబుదీర్చుటకుఁ - దాపసివై చన నాలుఁదమ్ములున్
దల్లడమంది వెన్దవులఁ - దాపసులెల్లరుఁ జింతనొంది ని
న్నల్లనఁ బ్రస్తుతింపఁగను - నందఱకున్ బ్రముదంబుగూర్చి తే
నెల్లవిధంబులన్ బిలువ - నేలొకొ రావిటు ॥రాఘ॥ ౧౫.

ఉ॥ కామముచేతశూర్పణఖ - కన్నులుగానకమిమ్ము వేఁడనా
కామిని కర్ణనాసికల - ఖడ్గముచే ననుజుండు గోయనా
భామిని సూడుదీర్పఁగను - వచ్చి ఖరాదులు ద్రుగ్గినారు నీ
చే మహనీయ శౌర్య సువి - శిష్ట జనాదర! ॥రాఘ॥ ౧౬.

ఉ॥ భూమిజమాయలేడిఁగని - భూవర! తెమ్మనఁ బోవనేల? ఆ
భామినిఁగోలుపోయియట - బాష్పములెక్కుడురాల్చ
నేల? ఈ
పామరబుద్ధి యేమిటికి ? - పావనమూర్తివి నీవెఱుంగవే
"స్వామి కెంటుట్లులానమె"నను - సామెతచేసితి ॥రాఘ॥ ౧౭.

ఉ॥ నీరధి! త్రోవనిమ్మనుచు - నిమ్మనునీవును దర్భశయ్యపై
వారకయున్నఁగైకొనక - వార్ధిధిపొంగుచునుండ లక్ష్మణా!
క్రూరుడునిర్దయుండనుచుఁ - గోపముచేవిలు నెక్కు వెట్టియు

వ్వారిధి వారిజాస్త్రమున - భంగము సేయవె! ॥రాఘ॥ ౧౮.

ఉ॥ వారధిగట్టువానరులు - వాంఛనప్రముఖులు బర్వతంబుల
వ్వారిగఁదేఁగనొండుడుత - వారిమునుంగుచు నేలఁబొర్లుచుఁ
వారధిమీఁద రాల్పఁగని - వారనిప్రేమనుదాని వీఁపునం
దారసిరేఖగా నిముకు - నట్టి దయాపర! ॥రాఘ॥ ౧౯.

ఉ॥ అత్తఱిరావణాసురుఁడ - హంకృతితో విభవంబు మీఱగా
నుత్తరగోపురాగ్రమున - నుండఁగనుంగొని నీవులక్ష్మణా
యెత్తుము వింటినంచుఁగొని-యేసినరావణుఛత్రచామరాల్
తుత్తుమురై ధరంబడవె - తోయజలోచన! ॥రాఘ॥ ౨౦.

ఉ॥ దారుణనాగపాశములు - దానవుఁడేయఁగనీవుఁ దమ్ముఁడుఁ
ధారణిమీఁద వ్రాలఁగని - తాళక జానకి తల్లడిల్లదె
వారఁగఁబాముసెజ్జఫణి - వైరితురంగమమైరహింపఁగా
నారదుమంత్రమేల? కరుణావరుణాలయ! ॥రాఘ॥ ౨౧.

ఉ॥ భండనమందుభీముఁడవు - బాంధవుఁడౌదువు భక్తకోటికిఁ
ఖండనసేయ రుద్రుఁడవు - కార్ముకవిద్యల భార్గవుండవే
పండితకోటికెల్లఁ గన - బ్రహ్మమవౌదువు రామచంద్ర! నే
దండిగఁజేయుపాపములఁ దారొలనికాల్పుము ॥రాఘ॥ ౨౨

ఉ॥ తల్లియుఁదండ్రి భార్యలును - దమ్ములు నన్నలుఁ బుత్త్రి
లాప్తులిం కెల్లరు నెల్లభూమియును - హేమమురత్నములెల్ల
సంపదల్

కల్లలటంచురోసిమదిఁ - గామితమిచ్చునను రాముఁడంచు నా
యుల్లమునందు నమ్మితిని - నొప్పుగఁ బ్రోవుము ॥ రాఘు॥ ౨౩

ఉ॥ తమ్ముని నేయరావణుఁడు - తప్పక లక్ష్మణుఁడడ్డురాఁగ నా
స్త్రమ్ము రమందు నందగులఁ - జయ్యన మూర్ఛిలఁ జూచి
నీవు నో
తమ్ముఁడ! యంచు నేడ్చికను - దమ్ములనగ్ని కణంబులుర్ల బా
ణమ్ముల వానిఁ గొట్టితి ర - ణస్థలి విక్రమ ॥ రాఘు॥ ౨౪.

ఉ॥ సుందరనీలదేహమును - సోముని గేరెడి మోముఁ బ్రేమపైఁ
జిందెడు నీక్షణమ్ములును - శ్రీయుతవక్షము దీర్ఘబాహువుల్
పొందిక లైనపాదములు - పూజయొనర్చెద వాక్సుమంబులన్
డెందమునందు నిల్పివిను - తించెద నెప్పుడు ॥రాఘు॥ ౨౫.

ఉ॥ ధారణి నిన్నుఁ గన్నతలి - దండ్రుల దుఃఖము పాలు సేసినీ
వారని లేక కష్టముల - పాలొనరింపవె సోదరాళినిం
పారఁగ భార్యయైనజన - కాత్మజ వారని దుఃఖమందెనీ
వారి నెంటుట్లు చేయునిను - వచ్చునెనమ్మఁగ ॥రాఘు॥ ౨౬

ఉ॥ ఉండుటయబ్ధియందుసతి - యుండుటవక్షమునందుఁ బుత్త్రకుం
డుండుట నాభియందు సుత - యుండుట పాదములందుఁ
గోడలో యుండుట వాక్కునందుమన - సుండుట దాసుల
యందటంచు నే
దండము పెట్టుచుంటి దయ - దప్పక ప్రోవుము ॥రాఘు॥ ౨౭.

చం॥ సుతుఁ ససృజింపఁబోవునిఁక - సోదరికోరుకలు నీయఁ
బోవు నీ
సతిసిరులీయఁబోవుసుతు - చానమతింగలిగింపఁబోవు నీ
సుతప్రజఁగావఁబోవుమటి - సోదరిభర్త వధింపఁబోవు స
ద్ధితమతిఁ బ్రోతువందఱను - నీవనురక్తిని ॥రాఘ॥ ౨౮.

ఉ॥ ఇల్లును లేక సంద్రమున - నెట్టులు కాపురముంటివో క్షమా
వల్లభ! భారమేయనక - వక్షమునన్ సిరినెట్లుమోచితో
బల్లిదుఁడైన పుత్త్రకుని - బాగుగనాభినినెట్లుమోచిత
ట్లల్లననన్ను నీపదము - లందున నిల్పవె ॥రాఘ॥ ౨౯.

ఉ॥ ఏమిభవంబిదేమి బ్రదు - కేమి సుఖంబు జగంబునందునన్
వేమరుపుట్టిగిట్టు వెతఁ - బెట్టఁగనేటికి? పంకజాక్ష! త్వ
న్నామ సుధామరందమును - నర్మిలిఁద్రావఁగ బుద్ధినిమ్ము
హా
సామజపాల! నీకెపుడు - జాఁగిలిమ్రొక్కెద ॥రాఘ॥ ౩౦.

ఉ॥ "ఘోరరణాంగణంబునఁ స - కుంఠితవిక్రమునాసురాధిపున్
గ్రూరతరాంబకాహతులఁ - గూల్చితదీయసహోదరున్ గ
దున్
గూరిమిమీఱురక్కసుల - కున్ వెసరాజునొనర్చితో-అహా!
పారమునాస్తి! తావక కృ - పాజలరాశికి ॥రాఘ॥ ౩౧.

ఉ॥ ఎచ్చుగు వేదముల్ గొనుచు - నెక్కటిసోమకుఁడబ్ధిఁజొచ్చినన్

మచ్ఛపురూపుతోనసుర - మర్దనచేసి విధాతకెంతయున్
మెచ్చుగనీయవే శ్రుతులు - మేలొనరించెడివాఁడవయ్యు నా
కచ్ఛగమోక్షమీవుత గ - వేన శుభంకర! ॥రాఘు॥ ౩౨.

ఉ॥ వారక దేవదానవులు - ప్రార్థనసేయఁగనీవు ప్రేమదై
వారఁగఁగొండనెత్తిపగ - వారలచే నమృతంబునీకనీ
వారికెయిచ్చినావుపగ - వారలమోసముచేయనేలనీ
వారికెదాసురాలనను - బాతిగఁబ్రోవుము ॥రాఘు॥ ౩౩.

ఉ॥ ధారణిఁజాపచుట్టుకొని - దానవుఁడంతరసాతలంబునన్
దొరిచిత్రొక్క-వానిఁగని - తోడననీవు వరాహరూపివై
వారకగ్రుచ్చి క్రొమ్మెనను - వానివధించి ధరిత్రినిల్పవే
శూరలలామ! నన్నుదయఁ - జూడవె దీనను ॥రాఘు॥

చం॥ అదితికిఁబుట్టి గుజ్జువంఁలు - యగ్రజుకై బలిదానవేంద్రునిన్
గుదురుగమూఁడుపాదములు - కోరిధరిత్రిఁ ద్రివిక్రముండవై
యదిమి రసాతలంబునకు - నబ్బలిఁజేర్చి సురేంద్రునిల్పవే
సదయమతిన్ దివంబునను - సన్మునిసన్నుత ॥రాఘు॥౩౫.

ఉ॥ డింభకయన్నిచోటులఁగ - డిందిగనుండెడి విష్ణుఁడంచు సం
రంభముతోడఁ బల్కె-నుతి - రంబుగఁ జూపెదవేర!
యీమహా

స్తంభమునందు సందమసుతు - దర్పముతో నదలించు రక్కసుఁ
దంభునిజంపి భక్తునుడి - తప్పకనిల్పవె ॥రాఘు॥ 3౬.

చం॥ పరశువుఁదాల్చి మున్నునర - పాలురనెల్ల నిర్వశీకృమార్
శిరములుద్రుంచి తర్పణము-సేయవెతద్రు ధిరంబుచేనిలన్
దరమిడికార్తవీర్యనృపు - దర్పమడంచినమేటి రాముఁడై
పరఁగితివౌర! నీకునను - భారమెకావఁగ ॥రాఘు॥ 3౭.

ఉ॥ రాముఁడనంగ సూర్యకుల - రత్నముగాజనియించిభార్యయూ
భూమిజఁగూడి కానలకుఁ- బోయితదంగనఁగోలుపోయియ
కాక్షముకుఁడైన దుష్టదశ - కంధరదానవుఁగూల్చినట్టిసం
గ్రామవిశారదుండెకద - రా! వచియింపర. ॥రాఘు॥3౮.

ఉ॥ దేవకిగర్భమందు వసు - దేవతనూజుఁడవై జనించియూ
దేవహితార్థమైఖలులఁ - దీటిచిభూభరముద్ధరింపవే
పావనులైన గోపకుల - పాలిటిదేవుఁడవంచహర్నిశల్
భావమునన్స్మరించెదను - బాలనసేయవె ॥రాఘు॥ 3౯.

ఉ॥ "సాధులఁబేదలన్గుజన - సంఘముహింసలోనర్చుచుండశు
ద్ధోధనపుత్రికుండవయి-శ్శుర్ణయమొర్చియహింసతత్వముః

బోధనసేసి లోకములఁ - బ్రోచిన బుద్ధుడవంచునిన్నహో
సాధుజనార్దనా! సతము - సన్నుతిసల్పెద ॥రాఘ॥ ౮౦.

ఉ॥ కలికితనంబుచేత నతి - కర్ముల దృష్టికిఁ గానరాక నీ
వలఘుమహాత్వశక్తిమెఱు - నందఱకద్భుతశూన్యమూర్తివై
వెలయుచు శేషశైలమున - వేంకటనామముదాల్చి భక్తులన్
సలలితరీతిఁ బ్రోచెదవొ ? సజ్జన సన్నుత ॥రాఘ॥ ౮౧.

ఉ॥ అంబుజనేత్ర ! యుష్మదవ - తారములన్ వినుతింపశక్యమే
యంబుజసంభవాది త్రిద - శావళికైన జగంబులోనపు
ల్లాంబుజనాభ మస్మదికి - నాదినయంత నుతింతు నీదుపా
దాంబుజయుగ్మమెప్పుడును - నాత్మనుసల్పెద ॥రాఘ॥ ౮౨.

ఉ॥ తల్లులకెల్ల మ్రొక్కి - మఱిఁ - దమ్ములఁగౌఁగిటఁజేర్చి యెల్లవా
రల్లములందుసంతసము-నొందమునీంద్రులకెల్ల మ్రొక్కవా
రెల్లరునిచ్చు దీవనల - నెక్కుడునీమది నుబ్బనాపు శ్రీ
వల్లభనన్నుబ్రోచుటకు - వత్తువెగ్రక్కున ॥రాఘ॥ ౮౩.

ఉ॥ తమ్ములతోడరావణుని - తమ్మునితోడను వాలితమ్ముతో
నిమ్ముగబుభుక్షవానరుల - యిష్టులతో భుజియింపుచుండిరా
రమ్మని పొత్తుగాఁగుడువ - రంజిలమారుతిఁజీరినాఁడవే
మమ్మునుబ్రోవు మట్లుమది-మఱ్వఁగమేరమె ॥రాఘ॥ ౮౪

ఉ॥ కంజజుఁజేరి భూమిసతి - కన్నులనశ్రులురాల్ప బ్రహ్మయున్॥
గంజదళాక్ష! భూభరము - గావుమనంగను నీవుదేవకీ
కంజదళాక్షిగర్భమునఁ - గంసునియింటను నుద్భవింపవే
యంజలిచేసెదన్ గరుణ - నాఁడిఁబెట్టకు ॥రాఘు॥ ౪౧.

ఉ॥ తల్లికిసంతసంబొదవ - తండ్రికిఁగాళ్లుల సంకెలల్ విడన్
నల్లనిరాత్రివేళ యమునా - నానది త్రోవనొసంగె నిందిరా
వల్లభత్వన్మహామహిమ - వర్ణనసేయఁగ సాధ్యమానెనీ
యల్లునిభూషణప్రభుని - కైనఁదలంపఁగ ॥రాఘు॥ ౪౨.

ఉ॥ నందునినందనన్ గొనుచు - నర్మిలిదేవకి ప్రక్కనుంచఁగా
నందమునొంది యాసుఁ గు - హాయని యేడ్చిన నంతఁ గంసుఁడున్
గందిమనంబునందచట - గ్రక్కునఁజేరి యదల్చిబాలరా
తందగ వేయఁదప్పిచనెఁ - దారపథంబున ॥రాఘు॥ ౪౭.

ఉ॥ బాలుఁడుపుట్టినాఁడు మన - భామయశోదకటంచుగోపికల్
మేలగువస్తువుల్ గొనుచు- మెల్లనఁబోయియశోదబాలునిన్
జాలఁగఁజూచిచూచి జల - జాసనుచేతకు మెచ్చిమెచ్చి త
ద్బాలుని ముద్దులాడిరది - భాగ్యముకాదొకొ ॥రాఘు॥ ౪౮

ఉ॥ కంసుఁడుపంపఁబూతనయుఁ- గాముశరాకృతినాఁగఁజేడెయై
హింసయొనర్పనిన్నుఁదగ - నెత్తుకముద్దిడిచన్నుగుడ్పినన్
సంశయమింతలేకచని - స్తన్యముద్రావుచుమీఁదరక్తమున్

మాంసముఁ బ్రాణముల్ గొనుచు - బ్రమోదముఁ జేయవె॥ రాఘు॥

చం॥ శకటమురీతిదానవుఁడు - చయ్యనవచ్చినసీవుచూచి త
చ్ఛకటముఁగూలఁదన్నునది - చప్పునమింటికి లేచిశీర్ణమై
వికలముసై ధరంబడఁగ - వీరుఁడురక్కసుఁడట్లుగూలఁగాఁ
బ్రకటితమయ్యె విక్రమము - బాల్యమునందున ॥రాఘు॥ ౧౦

ఉ॥ భారముమోవలేకనిను - భామయశోదయుఁ గ్రిందఁ బెట్టఁగా
బోరనగాలితోడఁజనెఁ - బోఁటుఁడుమింటి కటంచుగోపికల్
బోరున నేడ్వనాయసురఁ - బొందుగఁగుత్తుకఁ ద్రిప్పిధారణిన్
బోరునద్రొబ్బినావుననుఁ - బ్రోవుముసీడక ॥రాఘు॥ ౧౧.

చం॥ తడఁబడునడ్గువెట్టుచును - దల్లినిజేరుచు దూఱఁబాఱుచున్
బుడిబుడిపల్కునంజనుచు - బోఁటులయిండ్లకుఁబోయినప్పు చున్
తడయకదుడ్కులాపనులు - దప్పక సేయుచునుండ గోపికల్
వడిఁజనితల్లితోడనిటు - వారక చెప్పిరి ॥రాఘు॥ ౧౨.

ఉ॥ బాఁలుడుపాలకేడ్వగను - బాలురతల్లులు ముట్టవెట్టమీా
బాలుఁడునవ్వి క్రేపులను - బాలకుడోలెను నాలచెంతకున్
బాలునియానసుక్కుమన - బాలునిబట్టుకవత్తుమమ్మయో
బాలకురంగనేత్రయని - భామలుపల్కిరె ॥రాఘు॥ ౧౩

చం॥ పడతుకసీకుమారకుఁడు - పానలఁగ్రాగెడిపాలనెల్ల నా
పడుచులకెల్లఁబోసి మఱిఁ - పాత్రములెల్లనుగొట్టినాఁడుసీ

కొడుకును నాజ్ఞ చేయుటకుఁ - గూడునో కూడదో పల్కు
వమ్మ యీ
ల్వీడిచి పరస్థలంబులకు - వెళ్ళెదమందురు ॥రాఘు॥ ౫౪.

ఉ॥ పుట్టియుఁ బుట్ట లేదుకడు - బూమెలు నేర్చిన బాలుఁడమ్మ మా
యుట్టికిఁ గ్రిందఁ జోలుపంయి - నుంచియుఁ బీటల నెక్కియుండ
కన్
జట్టికిఁ దూఁటు వెట్టియది - జాఱెడు త్రోవను నోరు వెట్టి తా
నిట్టులు పాలు ద్రావెనని - నింతియొకర్తుక ॥రాఘు॥ ౫౫.

ఉ॥ వాడలు వాడలందిరిగి - వారక మా పెరుగెల్ల ద్రావి మా
కోడలి మూతికిం జరిమెఁ - గొట్టితిమమ్మ! యెఱుంగ లేక మా
కోడలెౘ్రుచ్చటంచునిది - కూడునె నీవ వచింపుమంచు నా
చేడియలా యశోదకటు - చెప్పరె శ్రీయుత ॥రాఘు॥ ౫౬.

ఉ॥ వారలయిల్లు సేరి దధి - వారకయంతయుఁ ద్రావి నీసుతుం
డీరలయింటఁ గుండలిడ - నీరలు వారలు వాదులాడనో
వారిజనేత్ర! నీసుతుఁడె - వారికిఁ దీర్పు సెప్పు నె
వ్వారికి న్యాయమౌనె యని - వారలు పల్కిరె ॥రాఘు॥ ౫౭.

ఉ॥ దేవరఁ బెట్టి మేము మన - దేవుని పూజ యొనర్చు చుండఁ దా
నావలఁ కేఁగి పళ్ళెరము - లంతభుజించెను గన్నులున్న మా
దేవుని శక్తి యెంతయును - దేకువ నేరక పు కృష్ణ నాఁగ మా
దేవునిగాలఁ దన్నె నని - దీల్వడి రందఱు ॥రాఘు॥ ౫౮.

ఉ॥ కోఁతినిదెచ్చి వెన్నగల - కుండనుముందటఁబెట్టఁ గృష్ణ! యీ
కోఁతిని బాఱఁదోలుమనఁ - గోమలి నేరవు రామకార్య మీ
కోఁతియెపోవు సీతఁగనఁ - గొమ్మనియుంగరమిచ్చెఁగోఁతి
కిఁక
నాతి! యొనర్చు టేమియని - నాతులుపల్కరె ॥రాఘ॥గీ

ఉ॥ మూఁగిటనిద్రవోఁగనుచు - ముద్దులకూఁతురువేణిఁగట్టి మా
బింగిరిదూడతోఁకకును - బెట్టులుగొట్టుచుఁ బాఱవత్సముల్
రాగుగఁదట్టిచేతులను - ఱాయిడిపెట్టుచు నవ్వుచుండె మే
ముంగనియేడ్వ మేలెయని - బోఁటులుపల్కరె ॥రాఘ॥

చం॥ ఎఱుఁగఁడు కృష్ణుఁడంచునది - కేఁగిపటంబులనూడ్చి నీటిలో
దిరుగుచునుండఁ జేలములఁ - దెచ్చి మహీరుహమెక్కి
వేడఁగాఁ
దరుణులురాను నిర్వడిచి - దండము వెట్టుఁడు చీరలిత్తునం
చరవరచేసె మేలెయని - యందురుకొందఱు ॥రాఘ॥

చం॥ దధికలశంబుఁ గొట్టెనని - దండన సేయఁగ ఱోటఁగట్టవాఁ
డది పెకలించి యీడ్చికొని - యుత్తజిమద్దులఁ గూలఁద్రో
యఁడే
యధికబలుండు పట్టుటకు - నబ్జభవాదులకైన శక్యమే
సుదతిగొ నీకుమారకుని - జూడవెయుందురు ॥రాఘ॥ ౬౨

ఉ॥ దారియుభర్తయొక్కటము - దంబునబాధఁగనీఁడు పాఘున

వ్వారలపైన వీడఁగని - వారలు భీతిలిపాఱుచుండఁగా
నూరకనవ్వుచుండెనిది - యోగ్యమెచెప్పుమయిట్టి వాఁడు
మున్
ధారణిలోన లేఁడనుచుఁ - దల్లికిఁజెప్పరె ॥రాఘ॥ ౬౩.

ఉ॥ సుతులును లేరటంచునొక - సుందరియూడఁగనన్ను వేఁడినన్
సుతులుజనింతురంచుమఱి - చొక్కపుమాటలనాడెనీసుతుం
డితవరెంటయిట్టిబాలకుల - నేయుగమందునఁ నైనఁజూడలే
దతివరోయంచు గోపసతు - లాడరెనిన్నును ॥రాఘ॥ ౬౪

ఉ॥ నిక్కపుదేవుఁడంచునిను - నీరజలోచన వేయిభంగులన్
మక్కువతోడఁబిల్వమఱి - మాటయుఁబల్కక ప్రోవకుం
డినన్
గ్రక్కున నీపదాబ్జములఁ - గట్టెదనామదిలోన సత్యమిం
కెక్కడికేఁగిరాదు నను - నెప్పుడు వీడకు ॥రాఘ॥ ౬౫.

ఉ॥ రాజును లేనిరాజ్యసభి - రామము లేనిపురంబుధారణిన్
బూజలు లేనిగుళ్ళధరఁ - బుత్త్రులు లేని గృహంబు లేల నీ
పూజలు లేని నాస్తికులు - పుట్టఁగ నేల ప్రపంచకంబునన్
రాజవునీవుకావెనను - రక్షణసేయుము ॥రాఘ॥

ఉ॥ ఎంతని వేఁడుచుందుమఱి - యెంతటిపూజలొనర్చుచుందు ని
న్నింతటివాడఁవంచెఱుఁగ - రెప్పుడునబ్జభవాదులైన నా
యంతటిదీనురాలినిఁక - నాఱడిఁబెట్టఁగన్యాయమా నెఱ్శీ

కాంతనుగూడివచ్చినను - గావుము వీడక ॥రాఘు॥ ౬౭.

ఉ॥ ఎప్పుడుచూతునిన్నుమది- నెప్పుడు మ్రొక్కుదు చేతులెత్తినీ
కెప్పుడు చేతులారరచి - యింతును నుత్పలచంపకంబులన్
జెప్పుమునీవ యేదొసంగు - నేసతినీ మొడ నీతయేల ? నీ
విప్పుడెవచ్చి యీప్సితము- లీయవె శ్రీయుత ॥రాఘు॥ ౬౮.

ఉ॥ వత్సమురీతిదానవుడు - వత్సములున్నెడ మేయుచుండనీ
వుత్సవమొప్పవానిఁగని - యొయ్యనవత్సక దైత్యుఁజంపిమా
వత్సములెల్లమేపికొని - వచ్చినవాఁడవు కాననాపయిన్
మత్సరభావమేలనను - మానక ప్రోవుము ॥రాఘు॥ ౬౯

చం॥ అడవికిఁబోయియొక్కపరి - యంబికపూజ యొనర్పనందునిన్
విడువక పట్టెఁబాము విడి - పింపను సత్తువ లేక గొల్లలున్
దడఁబడుచుండనీవుగని - తన్నిభుజంగముఁ దంఘ్రిఁగాచితో
విడువకనన్నుఁబ్రోచుటకు-వేగమరమ్మిఁక ॥రాఘు॥ ౭౦.

ఉ॥ గోపికలెల్లగొల్వఁగను - గొబ్బునరాముఁడు నీవురాత్రులం
దోపికతోడఁబాడఁగను - నోర్వకయక్షుఁడొకండుకన్నులన్
దాఁపఁగనీవురాముఁడును - దర్పముమీఱఁగ యక్షుఁజంపియా
యాపదయందుఁగోపికల . కాదరువైతివి ॥రాఘు॥ ౭౧.

ఉ॥ కాలునుగీటియంకెనిడి - గ్రక్కునఁగొమ్ములు నేలగ్రుచ్చు చుఁ
మేలముతోవృషాసురుఁడు - మెల్లనమందను జేరనీవునీ
కాలనుద్రొక్కిపట్టుకొని-గాటపుఁగొమ్ముల నూడ్చిచంపిగో
పాలురఁగాచితౌర! జన - పాలశిఖామణి! ॥రాఘ॥ ౭౨

ఉ॥ నీటనునుండుకాళియుని - నెట్టనబైటికిఁ ద్రోయనెంచియా
దాటునవృక్షమెక్కియు ప్రహ-దంబునదూఁకి ఫణీశునెత్తిపై
నీటుగనాడుచుండఁగఫ - ణిప్రియకాంతలుభర్తృభిక్షముఁ
వాటముగాఁగవేఁడినను - వారకయిచ్చితి ॥రాఘ॥ ౭౩

ఉ॥ ఘోటనిశాటుఁగాంచిమది - గొబ్బునభీతిలమందవారలా
దాటుననుండినీవువిని - దర్పమెలర్పఁగ వానినోటిలో
నేటుగదూటిపోయినెటి - నెమ్ములుప్రేవులు ద్రెంచివేగనా
ఘోటముఁజంపికాచితివి - గోపకులఁదయ ॥రాఘ॥ ౭౪

ఉ॥ బాలురఁగ్రేపులఁగొనుచు - బమ్మయొకానొకచోటదాఁ పనా
మూలమెఱింగిదూడలును-ముద్దులబాలురునై చరింపవా
నాలుగుమోములయ్యునిను- నందకిశోరమభక్తిమొక్కెఁడే
జాలములేలనయ్యనను - సమ్మతిఁబ్రోవుము ॥రాఘ॥ ౭౫

ఉ॥ అన్ననుగూడివీథులను - నాడుచుమన్నుఁదినంగనిన్నుమీ
యన్నయెఱింగిత్వజ్జనని - కెంతయుఁజెప్పఁగనోటఁజూపవే

మున్నునుమిన్నుసూర్యశశి - మానవులాది సమస్తజీవులన్
మున్నుదినంగలేదనుచు - మానవనాయక ॥రాఘ॥ ౭౬.

ఉ॥ మామయుఁబిల్వనంపనను - మానమునొందకయున్నతోడు
తన్
ప్రేమరథంబునెక్కికొని - ప్రీతినిగొల్లలుగొల్వఁబోయిమీ
మామపురంబుఁజొచ్చితివి - మాన్యులు నిన్నునుతింపు
చుండఁగా
గామితమిచ్చి భక్తులను - గాచితివచ్చట ॥రాఘ॥ ౭౭.

ఉ॥ వాఁకిలిముందుచాకిఁగని - వస్త్రములిమ్మన నీవు వాఁడుపో
గోకులబాలయీయననఁ - గోపముమీఱఁగవానిఁజూపి
యా
వాఁకిలిఁజేరియంతఁదగ - భద్రగజంబును సంహరించితే
మాకిలనీవెదిక్కుపలు - మాటలవేటికి ॥రాఘ॥ ౭౮.

ఉ॥ చెల్లెలినిత్తునంచునటు - చేదినృపాలుని జీర రుక్మియున్
వల్లభుఁడీవయంచునొక - బ్రాహ్మణురుక్మిణినీకుఁబంపఁగా
నెల్లరుఁజూచుచుండఁగనె - యేపునరుక్మిణిఁదెచ్చుకృష్ణనా
యుల్లముచల్లఁజేయుచును - నుండుము యెప్పుడు ॥రాఘ॥

ఉ॥ దండముకృష్ణనీకు యమ - దండనకోరువఁజాలనయ్యనా ।
దండనునీవెయుండికరిఁ - దప్పకగాచినరీతిఁగావవే
కుండలిశాయివౌచునిటు - గూర్చుచునుండఁగనీకునాయమే

యండజవాహ! నాదయిన - యాఁతడిమాన్పర ॥రాఘ॥

ఉ॥ దుష్టుఁడు కౌరవాధముఁడు - ద్రోవదికట్టిన వల్వలీడ్వఁగాఁ
గష్టమునోర్వలేకమదిఁ - గారుణికోత్తమ! కావుమన్ననా
శిష్టకునక్షయంబరుచుఁ - జేలములిచ్చిన కోమలాంగనా
యిష్టములిచ్చి కష్టముల - నిడ్డితొలంచుము ॥రాఘ॥ ౮౧

ఉ॥ దశరథపుత్రకుండవయి - ధారణిభాస్కరవంశవార్ధికిన్
శిశిరకరుండవై వెలసి - సీతను బెండిలియాడి క్రూరుఁడౌ
దశముఖుఁగూల్చిభక్తులను - దారతఁ బ్రోచిన వాఁడవంచుని
న్నిశరణుచొచ్చితిన్ మనుప - నేరవెదీనను ॥రాఘ॥ ౮౨

చం॥ జగమనుభూరుహంబుపయి - సమ్మతినిల్చివినిర్మలాత్మనై
గగనమువంకఁ జూచినిను - గంజదళేక్షణ! యంచుబిల్వఁగన్
బగఁగొనిశత్రులార్గురిదె - పర్విడివచ్చిరిక్రిందఁ ద్రోయఁగన్
ఖగచరాధినేతవయి - గ్రక్కునరమ్మిటు ॥రాఘ॥ ౮3

ఉ॥ శైవులుశంకరుండనుచు - జైనులు శ్రీజనుఁడంచు వైష్ణవుల్
శ్రీవరుఁడంచుఁబల్కెదరు - శ్రీవరశంకరజైనదేవులున్
నీవకదాయిటుల్ మిగుల - నేరిమితో భువి భేదనామఁడై
జీవులనెల్లఁగాచెదవు - సేవితపద్మజ! ॥రాఘ॥ ౮౪

చం॥ నటకులఁజేసిజీవులను - నాటకశాలగఁ జేసిధారణిన్
దిటవుగసూర్యసోములను - దివ్వియలన్ దగఁబెట్టిశాలకున్
నటకులకెల్లమూలమయి - నట్టువనాడఁగఁ జేయునీమహా

పటిమ నెఱుంగ శక్యమె? కృ - పావరుణాలయ! ॥రాఘు॥ ౮౫

ఉ॥ సూరుఁడు భాసమానుఁడయి - సొంపుగ నభ్రతలంబునన్ నిరా
ధారముగాఁ జరింపమటి - ధైర్యముతో విహరింపఁ దారకల్
కారణభూతుఁ డీవె కద - కానఁగ నో నొకో తావకీనమా
యారచనా విచిత్రముల - నజ్ఞులకిమ్మహి ॥రాఘు॥ ౮౬

చం॥ ఇనుఁడుదయించి తేపకడ - నింపుగ మాపున నస్తమింపఁగా
వనజదళాక్ష! చంద్రముని - బంపెద వట్టులు లేనిచో సతం
బును దివిఁ గానఁ జేసెదవు - భూరితరాంధికఁ బాపఁ దారకా
గణములఁ ద్వన్మహామహిమ - కానఁగ నో నొకో! ॥రాఘు॥

ఉ॥ పాపుల నెల్లఁ బెట్టెదవు - భర్మమణీమయ హర్మ్యసీమలన్
నీపదసేవ చేసెడివి - నిర్మలచిత్తులఁ బర్ణశాలలన్
గాపురముంతు వంచుఁ బలు - గాకులు ప్రేలుదు రయ్యయో
సిరుల్
ప్రాపణమైన నిన్నుఁ దలఁ - పన్ గమకింతురె ॥రాఘు॥ ౮౮

ఉ॥ నా సతి నాదు బాంధవులు - నా తలిదండ్రులు నాదు గేహముల్
నా సుతులంచు నన్నియును - నా వెయటంచును బీదసాదులన్
గాసిలఁ జేయుచున్ మిగులఁ - గాసులఁ జేర్చెడి మూర్ఖుఁ డిమ్మ
హిన్
వాసిగ మిమ్ముఁ గాంచునొకొ - వాసవవందిత ॥రాఘు॥ ౮౯

ఉ॥ భాసురవజ్రవారములు - భర్మవినిర్మితసింహాపీఠికల్
భాసిలుసౌధరాజములు - బాగరుసొమ్ములుభద్రనాగముల్
కాసులుమిక్కిలిమ్మనుచుఁ - గాంచనచేల! తలంపనింతయుఁ
వాసినమోక్షమిమ్మనుచు - వారకవేఁడెద ॥రాఘ॥ ౯౦

ఉ॥ స్వోదరపూరణార్థమయి - సొంపుగనామములన్ ధరించియు
మ్మేదినివిష్ణుభక్తులని - మేలుగనమ్మనటించువారికే
కాదనలేకమోక్షమొసఁ - గంగనిఁకేమివచింతునింతకున్
వాదనలేల? నీదయకు - వారడిలేదయ ॥రాఘ॥ ౯౧

చ॥ పరఁగభవత్పదంబులభ - వంబునుగాంచిన గంగనాజగ
ద్గురుఁడుసురారివిక్రమవి - గుర్వణదక్షుఁగుపార్వతీమనో
హరుఁడుమహాపవిత్రతర - మంచుశిరంబునఁదాల్చెనాఁగనీ
వరమహనీయుఁ నమః - వద్యముగాదొకో! ॥రాఘ॥ ౯౨

ఉ॥ భూరిభయంకరాఘగణ - భూజకుఠారము దుస్తరోగ్రదు
ర్వార దురంతసంసరణ - వారిధినౌక భవాంతసాంద్రనీ
హారసరోజమిత్ర సమ - మప్రతి మద్విష షట్క నాగనా
గారికదా! త్వదీయచరణాంబురుహార్చన ॥రాఘ॥ ౯౩

ఉ॥ తూరుపుఁగొండమీఁదదగఁ - దోవలజేడుదయింపకున్నచోఁ
దారకలెన్నియున్న వసు - ధన్ దమసం బునశింపనట్లు సీ
తారమణీ మనోహర ! స - తంబు భవత్పద భక్తిలేక దు
ర్వార దురంత కష్ట నిక - రంబు తొలంగునె.॥రాఘ॥ ౯౪

చం॥ అతులితరాజ్యవైభవము-లాత్మదృణంబుగనెంచితంద్రియా
నతిశిరసావహించిగహా - నంబునరుణజనిభారతీసుత
ప్రతతికిఁగార్యరూపపిత్రు - భక్తిఁబ్రబోధమొనర్పవేమహా
న్నతగతినల్లనాఁడుభువ - నంబులుమెచ్చఁగ ॥రాఘు॥ ౯౫

చం॥ ప్రవిమలభోగభాగ్యముల - భాసిలుదేశములెన్ని లేవునీ
వపురజనింపఁగావలెన - టన్నఁబురాకృతపుణ్యమేకదా !
భవదవతారభాగ్యముల-భారతమాతయెకాంచుచుండుటల్
కవిజనచక్రవాక సవ - కైరవబాంధవ ! ॥రాఘు॥ ౯౬

చం॥ పదములుసోఁకనోక్కశిల-భామినియయ్యెనటన్ననింకఁదొ
మ్మిదినెలలుఁభరించికని - పెంచినకోసల రాజకన్యకా
సదమలభాగ్యమెట్టిదొవ - శంబెవచింపభవన్మహోత్సవం
పదయదియంతయుఁదెలియ- - వచ్చునెశ్రీకర॥రాఘు॥ ౯౭

ఉ॥ ఎక్కడనుంటివయ్యకమ - లేక్షణ! దీనజనాళిఁబ్రోవఁగన్
మక్కువతోడనేగితివొ - భద్రగజంబును గావఁబోయితో
కక్కసపెట్టనేలనను - గారుణికోత్తమ ప్రోవఁగన్ దగన్
ఠెక్కులుగల్గు తేజిపంబు - టివ్వనరమ్మిటు ॥రాఘు॥

చం॥ కనవలెనీదురూపమును - గన్నులుగల్గినదానికిన్ దగన్
వినవలెనీదుకీర్తనలు - వీనులుగల్గినదానికిన్ మఱిన్
జనవలెనీదుసన్నిధికి - సమ్మతిఁబాదములున్నదానికిన్
మనవలెధాత్రినిల్పినిను - మానసమందున ॥రాఘు॥ ౯౯

ఉ॥ సోముఁడు లేని రాతిరియు - సూర్యుఁడు లేనియహంబు నెవ్విధిన్
భూమిని గళావిహీనమయి - పొల్పునొ తత్సరణిన్ భవల్లస
న్నామవిహీనగీతముల - నర్మిలినల్లుటనవ్వుఁ బాటుకా
దేమహిజామనోరమణ! - దీనజనావన! ॥రాఘు॥ ౧౦౦

చం॥ చదువఁగ లేదు సంస్కృతము - శాస్త్రములా యెఱుంగన్ గ
విత్వసం
పద మొదలే హుళిక్కి-యిఁక - బద్యము లెట్టుల నల్లుదాననీ
పదయుగమున్ మదిన్ నిలిపి - వ్రాసితినీశతకంబు గాన న

య్యదిగమనించి దీనిని గ - హింపుము వేగమ ॥రాఘు॥ ౧౦౧

ఉ॥ హా త్తిన వేడ్కతో నిరువ - దైనశతాబ్దమునందునన్ బ్రజో
త్పత్తిని బుష్యమీ బహుళ - పంచమినాఁటికిఁ బూర్తిచేసియా
యుత్తమపద్యరత్నశత - మోలినొసంగెను నీకుఁ గాన్కగా
హత్తినప్రేమతో నరస-మాంబనుబ్రోవుము ॥రాఘు॥ ౧౦౨

రా ఘు వే శ్వ ర శ త క ము

సమాప్తము.



# పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారిచే రచియింపఁబడినవి.

| | | |
|---|---|---|
| ఆంధ్ర భాషాలక్షణ శిక్షణము | ... | 1—0—0 |
| సుజ్ఞానబోధిని, మొదటిభాగము | ... | 0—5—0 |
| ,, రెండవభాగము | ... | 0—6—0 |
| ,, మూడవభాగము | ... | 0—8—0 |
| ,, నాల్గవభాగము | ... | 0—10—0 |
| ,, ఐదవభాగము | ... | 0—12—0 |
| విద్యార్థిశతకము | ... | 0—2—0 |
| గుణమణిశతకము | ... | 0—3—0 |
| ఇప్పటికలి (పద్యములు) | ... | 0—0—6 |
| మహింషపాచాశతి | ... | |

వలయువారు,

పూతలపట్టు శ్రీరాములు రెడ్డి,
తెలుగు పండితుఁడు,
బోర్డు హైస్కూలు,
చిత్తూరు.

అని వ్రాయవలయును.